# స్వయంవరం

"నవయుగ కవిచక్రవర్తి"

జి. జాషువ

ప్రకాశకులు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# భూమిక

కావ్యంపేరు స్వయంవరం. వధువు స్వరాజ్యం. పెండ్లి కొడుకులు ప్రజలు. మహాత్ముని సత్యాగ్రహ మహాయజ్ఞంలో స్వరాజ్యబాల జన్మిస్తుంది, ప్రతిఫలంగా బాపూజి బలవన్మరణాన్ని స్వీకరించి పరమపదిస్తాడు. ఉపసులు, తిరునాళ్ళు, ఊరేగింపులు చేసి దేశీయులు బాలకు బారసాల జరిపి, తాతగారి ప్రతిమలు, పల్లెల్లో పట్టణాల్లో ప్రతిష్ఠిస్తారు స్వరాజ్యబాల అంతై, యింతై పెండ్లీడు కెదుగుతుంది. స్వయంవరం ప్రకటిస్తారు, నీతిమంతులు, అవినీతిమంతులు, ధనవంతులు. దరిద్రులు, దొంగలు, దొరలు పెండ్లికొడుకులై వస్తారు. సత్యాహింసలనే చెలికత్తెలు పెండ్లి కొడుకుల్ని పేరు పేరు నగుసల వర్ణిస్తారు. కలకల నవ్వుతూ కళ్యాణవేదిక నలంకరించిన స్వరాజ్యకన్యక వలవల యేడుస్తూ సభారంగం విడిచిపోతుంది. అనురూపుడైన భర్తకోసమై, కన్యక దేశాటనం చేస్తుంది. అకృతార్థయై విసిగి వేసారి మంచుకొండల సమీపారణ్యాలు చేరి ఒకానొక బోయపల్లెలో వసిస్తూ మనశ్శాంతి చేసికొని కాలం గడుపుతుంది. ఒకనాడు స్వప్నంలో మహాత్ముడు దర్శనమిచ్చి సదుపదేశంచేసి బాల నోదారుస్తాడు. ఒకానొక యువకుని వివాహమాడి స్వరాజ్యం రాజ్యమేలుకొంటుంది. నవ యుగారంభ మౌతుంది. దేశంలో శాంతి నెలకొంటుంది. స్వరాజ్య సుఖాన్ని ప్రజలు చూఱలాడ్తారు. ప్రకృతిలో, విజ్ఞానంలో, విద్యలో, కళాలోకంలో, సంఘంలో వలసిన మార్పు లిందు వర్ణించబడ్డయి

నేనీ కావ్యాన్ని వ్రాసి ముగించి, ముద్రణకు ధన మెట్లు లభించునా యని విచారిస్తుండగా శాంతస్వభావులు, కళాప్రియులు, మదరాసు శాసనసభా సభ్యులు, నిరాడంబర జీవులైన శ్రీ మేడూరి నాగేశ్వరరావుగారు, ఒకనాడు నా కావ్యం విని సంతోషించి, వలయు ధనాన్ని సేకరించి, నా-కిచ్చి మహోపకారం చేసినారు. కడచిన వత్సరం వారు నా కయాచితంగా ఒకానొక మిత్రునిచేత రూ 400 రహస్యంగా నంపి, వారి గుప్తదానపరత్వంచేత నా కమితాశ్చర్యాన్ని కలిగించినారన్న వారి హృదయ మెట్టి పవిత్రమైనదో పాఠకు లూహించకపోరు. వారికి నా ధన్యవాదాలు. అట్టివారు పదుగురున్న కళాప్రపంచం కడగండ్లపాలు కాదని నా విశ్వాసం. వారికి దీర్ఘాయు వగుగాక.

గ్రంథకర్త.

నను ప్రేమించు కళాప్రియుల్ బలువురున్నా రాంధ్రదేశంబునం
దను సంతృప్తివినా వచింపదగు నొండాదాయమేలేని నా
కనుకంపం బదివందలంపిన యుదారాత్మం బ్రశంసించెదన్
వినుతుల్ గోరని గుప్తదానరతునిన్ మేడూరి నాగేశ్వరున్.

అని చెల్లించుకొనంగలేని కపటవ్యక్తుల్ దలల్ వంపసా
చని నా హస్తము నిండిపోవగ సహస్రద్రవ్య దానంబు స
ల్పిన నాగేశ్వరరావువంటి బుధు లుర్విం గొంద రున్నారు లె
మ్మని ధైర్యంబువహించి పొంగెదను సాంద్రానందమగ్నుండనై.

# స్వయంవరం

* బాల్యము
* స్వయంవరము
* దేశాటనము
* హిమగిరియాత్ర

# అంకితము

లలిత వాణికి, నిరాలంబాంధ్ర కవితకు
త్రోవలు సూపించు దొడ్డవాడు
ఆరిపోనీక నెల్లూరి గడ్డలమీద
సీవి తిర్లిక పంక్తు రెత్తువాడు
బాపుజీ మహదహింసా పాఠశాలలో
నుత్తీర్ణుడైన ధీసత్తముండు
ఘన సుదర్శనదేవి కమనీయ చరితకు
వడివంక లేనట్టి వల్లభుండు

మనుమ సిద్ధిరాజు మణిపీఠదీప్తులు
వెలిగి కీర్తిగన్న సింహపురికి
రత్నభూషయైన రామరాడ్విభు డస్మ
దీయకృతికి సర్వ్వానాయకుండు.

పిల్లలు గలవాడెడదన్
జల్లదనం బున్నవాడు సత్యాహింసా
వల్లరుల కొలవాలము
వల్లభుడై నాదు కృతికి వన్నె ఘటించున్.

విస్తులధీవిశాలరమణీయత, సత్కవికోటికిం ధా
వస్తువు చాలినంత సులభంబుగ జిక్కుటకిక్క, యావదా
ర్యస్తవనీయమంజులగుణార్ణవుడై తగు రెడ్డిరాణ్మణీ
హస్తము నందుకొన్న కృతు లన్నివిధాల నదృష్టవంతముల్.

తిక్కన భారతాగమము దేశకవీశుల లేతవాణికిన్
దిక్కయి కండపుష్టిని గదించినరీతి, ప్రసిద్ధమైన శ్రీ
తిక్కవరాన్వవాఁడు మొకదిక్కయి, యాశ్రయమై రహించెడిన్
దిక్కును మొక్కులేక కడు దీనతఁ జెందు కవీంద్రజాతికిన్.

అదియే దొడ్డసుబ్బనాంబ మహాలంబదాసీసుతై, సత్కళా
భ్యుదయధ్యానరతిన్ ని రంతర కవీట్పుష్పాంజలీ పూజలన్
ముదితుండై, సిరిసిల్ల రామవిభుఁ, ప్వాట్యాస్ గనుంగొన్నదో
బొవలు నెమ్మిమరందభాగముల క్రొంబుగ్గల్ గవిశ్రేణికిన్.

కృతువెన్నోసతుఁడై, సతీవిరహావహ్నిజ్వాల చల్లార్ప, నం
చితసాలంకృతభావగీతముల నర్పింపన్ గతక్లేశుఁడై
సతమున్ బ్రస్తుత కృష్ణరాయులన భాషాచర్చలం దేలు నూ
ర్జితతేజస్విని రామిరెడ్డిగని హర్షించున్ గళాదేవతల్.

నా కవితాప్రరోహము ననల్ దొడుగందగు చెమ్మ లీయసూ
యాకలితోగ్రభూముల రవంత లభించుట కాలపట్టుగా
వ్యాకరణానువాద సింహపురి భాగ్యఖనిన్ ఘనురామలాడ్విభున్
శ్రీకలితుం బ్రశాంతుని, విశిష్టకవిత్వకళాపరీక్షకున్.

కృత్తిక దేశ భక్త వితతి కారణముగా
నటమటించు గాంధి యంతరాత్మ
తిక్కవరపుకులుని, చక్కని శీలంబు
కారణముగ బొవలి యూరడిల్లు. —గ్రంథకర్త.

# బాల్యము

కులభేదము, మతఖేదము
కలికమునకు లేనివాడు, కలకండముతో
దుఃదూగు సత్యసూక్తులు
బలుకు సుతుం డొకడు బుట్టె భరతాంబికకున్.

అత డష్టకష్టములువడి
బ్రతుకంతయు ధారవోసిఁ పరహస్తగతన్
మతిమంతురాలి నొకరిత
స్వతంత్రతాశిశువు బడసె సచ్చరితుండై.

# స్వ యం వ రం

అడుగులకు మడుగులొత్తిరి
బుడుతంగొని తెచ్చినట్టి ముసలయ్యకు పు
త్తడినీట జలకమాడిచి
సిడమెత్తిరశోక చక్రచిహ్నాంబులతో.

వరలబ్ధయైన బిడ్డకు
సురుసులు తిరుణాళ్ల సలిపి హూరూరనెదన్
మురిసికొని దేశవాసులు
మరచి రఖిలవర్గ కలహమాలిన్యంబుల్.

ఆయమ్మాయిని జూచినంత విరళంబై, పంచబంగాళమై
పోయెన్ బానిసలక్షణంబులు, భయంబున్ శబ్దగాద్గద్యమున్
వేయిన్నూరుగజాల దివ్యబలమున్, స్వేచ్ఛాసుఖావేశమున్
గాయంబందు సముద్భవించె సకలక్ష్మాచక్రచంద్రాస్యకున్.

చిరకాల పరాధీనత
విరుగడ గావించి, శాంతి వెలయించిన య
చ్చిరునగవుల చినదానిని
స్వరాజ్యమని పిలిచి రెల్ల జగము నుతింపన్.

# బాల్యము

విసుగున కేడుమాసములు నిండియు నిండకముందె పాపమా
ముసలిని పొట్టబెట్టుకొనిపోయె నొకానొక పుణ్యమూర్తి త
ద్వ్యసనవినీలనీరదమహాంధతమస్సు విశాలపశ్వమున్
ముసరి, చరిత్రలో గరగిపోసె నఖండకళంకపంకమున్.

హత్య కగ్గమైన యమ్మహాత్మునకునై
చిన్న బాష్పకణము జిమ్మదయ్యె
పారమార్థ మద్యపానంబు గావించి
మత్తు గొన్న కఱకు మతము కన్న.

కంచువిగ్రహాలు; కాంచనవిగ్రహాల్
మంటివిగ్రహాలు మహిని వెలసె
ధర్మసంస్థలెల్ల తాతయ్యబొమ్మలు
శిరముమీద నెలమి దురముకొనియె

తాత మరణంబునకు గుండె దరిగిపోవ
రోదనము సేయు బిడ్డ సమ్మోదమొంద
తాత బొమ్మలు జూపి యోదార్చినారు
మడత భజనలతో కండ్లు దుడిచినారు.

# స్వయంవరం

ఎత్తించిరెత్తైన యెవరెస్టు శిఖరాన
ప్రియమార మూడు వన్నియలసిడము
చిత్రించిరల సేతుశీతశైలముదాక
తోరంపు ముత్యాల తోరణాలు
మ్రోయించినారు భూములు దద్దరిలిపోవ
ఘనమ్మైన శంఖాలు కాహళాలు
అల్లించినారు తీయని గీత మాలికల్
సకల భారత కవీశ్వరులచేత

హరిజనుల పల్లియలలోని తిరిగినారు
సర్వసమతకు విత్తనాల్ సల్లినారు
దేవళంబుల తలుపులు దెరచినారు
చక్కగా స్వరాజ్యము బారసాలనాడు.

కలకల నవ్వెడు తాతయ
శిలయై, కలయై యనంత శిల్పంబునకున్
బలమిచ్చి, మాయమయ్యెన్
కుల మత తత్వములు పుంజుకొని తలయెత్తెన్.

# బాల్యము

అందరు బిడ్డలవలెఁగా
దండాల స్వారాజ్య బాల, యుపనీతి లవం
బెందేని గోచరించిన
కుందుండెందాన పాలు గుడు క యేడ్చున్.

స్వచ్ఛంద పవన శాబకము ఉల్లసమాడు
హిమశైల శిఖరాన నృత్యమాడి
స్వేచ్ఛాప్రభాత రంజిత శాద్వలములపై
కాలూని చిన్ని షికారుజేసి
గళిత శృంఖలములై యలరు జాతీయ సం
స్థాబాలికలతోడ సరసమాడి
భయవిహీనంబులై, భావముల్ వెలిబుచ్చు
సకల శారదల కానుకల నంది

దేశమాతకొఱకు దేహముల్ విడిచిన
త్యాగిపరుల రక్తధార దడిసి
పూతమైన వీరభూములు ముద్దాడి
జరుపసాగె బాల శైశవంబు.

స్వ య ం వ ర ం

చలనంబులేని నడవడి
కలుషము లేనట్టి మాట గట్టితనంబున్
బలముగ, నహింస రవ్వల
యలంకృతు - గా ధరించు ననవరతంబున్.

ఎట్టి ప్రశాంతి, యెట్టి సుఖమెట్టి శుభోన్నతి, గోరి త్యాగులై
పుట్టి, తపించిరో మును పు బుద్ధుడు, క్రీస్తు మహాత్మగాంధి, క
న్పట్టె, స్వరాజ్యలక్ష్మి వదనంబున నట్టి కళావిశేషముల్
పుట్టిననాడ, యీ భరతపుత్రుల భాగ్యవిశేష మెట్టిదో

అరికట్టబడె, శాంతి నరికట్టి సాగించు
అవినీతిపరుల విహారకలన
బంధింపబడియె, దైవముపేర పెలుపెక్కు
పూజారిమూకల బూటకంబు
విరమింపబడె, దయావిరహితాత్మకమైన
నల్లమార్కెటుగాండ్ర నాటకంబు
ఖండింపబడె, నహంకార కారకమైన
భీషణవర్గ విద్వేషవహ్ని

## బాల్యము

గుడుగుట్టిన వెడ నమ్మకాల బిగువు
సడలి విజ్ఞానమల నల్ల సౌరభిల్లె
కడచె, కడలేని కఱకు సంగ్రాహ భీతి
దివ్యబాలిక దిశల వర్థిల్లువేళ.

బాల బడికి బోయి పఠియించె దేశ సౌ
భాగ్యమునకు వలయు పద్ధతులను
స్వేచ్ఛ నడ్డగించు విద్యావిధానంబు
మార్పు లేమి జూచి మథనపడియె.

ఆనవ్యాశయ పాఠశాలల సువిద్యాభ్యాసమున్ జేయు కా
లానన్ స్వార్థపరాయణంబులయి యల్పత్వంబు గల్పించు య
జ్ఞానాపాదకమైన కట్టు కథలన్ లక్షింప కేనాడు వి
జ్ఞానాపాదకమైన సత్య కథలన్ వల్లించు సోల్లాసయై

బడిలో జెప్పెడు నీతిపాఠములకున్ బాహ్యంబునం జేయు, దుం
దుడుకుం బోకడ కించుకంతయును పొత్తుం గానరాకుంట. ని
క్కడుపుంగూటి కళాలయంబుల బహిర్గాంభీర్యముల్, మాయపు
త్తడి వ్యాపారపు సంస్థలంచు మది సంతాపించె నత్యంతమున్.

# స్వయంవరం

అనుభవముమీద గుజరాతు మునివరుండు
వ్రాసిపోయిన ధర్మసూత్రములు చదివి
ఆటపాటల జైక క్షత్రియలకు నేర్పు
చిలిపి సిద్ధాంత భాష్యముల్ చీదరించు.

చదువ దఖంత భారత విషాద పురాతన రక్తగాథలన్
పదములు మెట్టి దెన్నడు సభాగ్యుల కందని క్షుద్రదేవతా
సదన సమీప సీమల నసమ్మత సాంఘిక సింహగర్జలన్
బెదరదు, విశ్వసించ దల పెద్దలనాటి పిశాచ ధర్మముల్.

మధు భర్తకై పుష్పరథము సిద్ధముచేయు
భూపురంధ్రీ శీలమునకు మెచ్చి
గొంతు బొంగురువోవ ఘోషించు నంబుధీ
శుని యీశ్వర ధ్యానమునకు మెచ్చి
జలదంబు కడుపులో జన్మ మెత్తిన మంచి
ముత్యాల సృష్టి కబ్బురము నంది
కొండలతో నెదుర్కొని తుత్తునియలైన
మబ్బు దున్నల బుద్ధిమాంద్య మరసి

## బా ల్య ము

నిమ్న భూములు గుర్తించి నింగినుండి
పరుగు లిడి వచ్చి తమ సమత్వమును దెలుపు
తేట నెలయేటి దివ్య సందేశములకు
హృదయ ముప్పొంగి తన్వంగి చదువు నేర్చె.

ఆశింప దిష్ట మృష్టాన్నంబు దేశ దా
రిద్ర్యంబు మనసు గారించుచుండ
మేనదాల్పదు చీనిచీనాంబరంబులు
ప్రేలికల్ గట్టు ప్రాంతాల నరసి
పలుక దెన్నడు చిన్ని పరుష వాక్యంబును
పొరుగు బాలిక లాడి పోసుకొన్న
తమక నీయదు మనోద్రఢిమంబు ప్రళయంబు
వికటాట్టహాసంబు విసరుచున్న

కరము చందు గాంధి దరహాసలవములో
దాగియున్న త్యాగ తత్వమునకు
క్షతము సోకనీక కన్యావతంసంబు
బాల్య చాపలము నుపక్రమించె

# స్వయంవరం

క్షామ దంష్ట్రాంకురక్షతికి నగ్గము గాని
సుఖసంపదల మోము సొగసుతోడ
ఈతి బాధల పదాఘాతంబు సోకని
పైరు పంటల మేని పసరుతోడ
నిమ్నోన్నతముల సంధిభూతములుగాని
సమదృష్టి దీర్ఘ నేత్రములతోడ
ఎఱుసు పోకడకు చోటీక గుప్పిటి కందు
తఱచైన కేశబంధంబుతోడ

ప్రబల వింధ్యాద్రి ధైర్య సర్వస్వ మెల్ల
కమిచి పట్టిన పెనుచనుకట్టుతోడ
యువత భూపుల చిత్తంబు లూగియాడ
యంబుజాస్యకు యౌవన మంకురించె.

మదగజయానమున్, మెఱుపుమాదిరి మేను, సరోజపత్రసం
పదగల కంటిసొంపితరభామలవంటి యొయార మందమున్
వెదకిన గానరాని యలవింతవధూమణి గాంచి సత్కవుల్
పదములు సాగకందు బడవైచిరి ప్రాగుపమాన వస్తువుల్.

# బాల్యము

అందరి రాజకన్యకల ముఖల నేలెడు గర్వరేఖలున్
మందికి దూరమౌ దురభిమానము నేపని లేక యంటినం
గందు శరీరకోమలత కన్పడ దయ్యో లతాంగి మూర్తిలో
మందున కట్టి లేమల సుమా ! మణిమండనముల్ సవిత్రికిన్.

పనిచేకాయలు గాచియున్న కరముల్ స్వచ్ఛంద రక్తంబుచే
ననుమానింపని దొడ్డ భావములు సత్యస్ఫూర్తి జెన్నారు చ
క్కని జిహ్వాల్, క్షమచే విరోధమును చక్కందిద్దు సద్వర్తనం
బును విస్పష్టముగా గనంబడియె నప్పూబోడి రూపంబునన్.

బహిరింద్రియముల సొగసుల్
బహిర్గతము చేయజాలు పైపై సుకవుల్
సహజానుభూతి చాలక
బృహదంతశ్శోభ లాలపింపం గలరే !

నగలు లేక మెరయు మగువ లావణ్యంబు
పెద్దవారి కింపు చేయదయ్యె
నగల కెల్ల దొడ్డ నగయైన శుభవేణి
అధికమతుల మనసు నాక్రమించె.

# స్వ య ం వ ర ం

పొడచూపె నక్కన్య య' గు మోపినచోట
నక్షయదృఢవీరలక్షణములు
తలయెత్తెనా బాల పలుకు పల్కినచోట
సత్య ధర్మములకు చలన శక్తి
చిగురించెనా రాణి, నగువు నాటినచోట
సమరస ప్రబల నిష్కపట ఖ్యాతి
గతియించెనా లేమ కన్ను లెత్తినచోట
మేను బెంచిన యంటరాని తనము

ధనము గ్రుమ్మరించి ధనిక వర్గము గప్పి
పెట్టు దుండగములు గుట్టలగుచు
విబుధ నేత్రములకు విస్పష్టముగ దోచె
సుందరాంగి గాలి సోకుచోట.



# స్వయంవరము

ప్రకటింపం బడియెన్ స్వయంవరము యావద్భారత క్షోణి, క
న్యక కర్షుండు గణాభిరాము డెవడైనన్ జాతి పట్టింపు లె
న్నక సుస్వాగత మిత్తురంచు, చెలగెన్ సన్నాహముల్, పెండ్లివే
దిక రత్నాంకితమై ప్రకాశిలె, జయేతిధ్వాన ఘూర్ణోద్ధతిన్.

చెరసాల యినుపపంజరమందు మూన్నాళ్ళు
గడపిన ముద్రికల్ గలుగువారు
పోలీసు లాటీల పోటులు చవిజూచి
కాయలేర్పడ్డ యంగములవారు

# స్వయంవరం

కాటాలఁగొని యింట రమణిమోమున వైచి
విహరించు గాంధి టోపీలవారు
పావలా సభ్యులై ప్రక్కపాటున నుండి
వల్లదప్పిన నింట బడెడువారు

ఈగ కాలుసోకనీకుండ నిజవర్ణ
రక్షణంబు గోరి బ్రతుకువారు
ముసుగుపరచనేల దొరలు దొంగలుగూడ
కూడి చెలమి పెండ్లికొడుకులగుచు.

పెద్దహడావిడుల్ సలిపి పెండ్లి యొనర్చి, బడాయిగొట్టుటల్
బుద్ధికి లోపమంచు బసుపుం గుసుమంబులు నాకుతోరణాల్
దిద్దిన కాయమానములు దీరుపఱంచి, గుణాభిరాములన్
బెద్దల బిల్వనంపి తనవింగొనె కన్యక నీతిపాత్రమై.

మతముల్, వర్ణములున్ ధనవ్యసనముల్ మాద్యద్దురాచారముల్
సతులై, పేరట మాచరించుటకు మస్తాబై సువర్ణంపు ట
క్షతలం గుప్పిట బట్టి రానరసి యక్కన్యావతంసం బస
మ్మతి జూపించె, వివర్తితాస్యయయి కంపంబెత్తు నెమ్మేనితో.

# స్వయంవరము

హరిజన కన్యకల్ వలపుటూహలు లిఁక బ్రచు బేరటింపగా
జురచుర జూచుచుం దొలగు సుందరులం గనినంత, నాఫ్రికా
దొరల సమాజ మధ్యమున తోరపు జిక్కులనందు గాంధిజీ
దరిసెనమిచ్చె కన్యకనుదమ్ములముందు మెరుంగు చాడ్పునన్.

పెండ్లికుమాళ్ల గుండె పురివిచ్చిన నెమ్మిపతెన్ నటింప, పి
ల్లెండ్లును, మట్టియల్ గదలి లేతసుఖల్ గురియింప, గుబ్బ పూ
జెండ్లు నటింప, క్రొంబసుపుచీర ధరించి, సఖీ ద్వితీయయై
పెండ్లికుమార్తె వచ్చె మణివేదిక చెంతకపేశభూషయై.

పూదండం గరమందు బట్టుకొని యొప్పుల్ కుప్పలై కూలగా
దాదుల్ వెంబడిరాదరస్మితము సిందన్ గుంచితగ్రీవయై
పాదాబ్జంబుల నందియల్ ఝణఝణధ్వానంబు గావింపగా
ఆదర్శాశయ చేరవచ్చె, నిజ కల్యాణాంతిక క్షోణికిన్.

మేలి ముసుంగు తూంట్లుపడ మిక్కుటపుం దమకంబుతోడ, భూ
పాల కుమారకుల్ బఱపు వాడివిలోకన బాణ పంక్తికిన్
బాలిక మారుచూపుల నుపాయనమిచ్చె, లతాంగు లెప్పుడున్
మేలును స్వీకరించి విరమింపరు ప్రత్యుపకార ముగ్ధలై.

# స్వ యం వ రం

"జయము ! స్వరాజ్య కన్యకు ! హసాదు ; మహద్భరతావనీ సద
న్వయకు ! శుభప్రదాత్రికని, నాలుగుదిక్కు"లు ప్రస్తుతింప. దు
ర్ణయపరతంత్రులై కపటనాటకమాడు పరావతంసముల్
భయవివశ త్ములై తలలు వంచిరి గుమ్మడిః యదొంగలై.

తాతయ పెంపునం బెరిగి తావులు జిమ్ముచు బాల్యమాది చే
యూతగనున్న ధర్మ నమ యోర్తుక బేరట మాచరింపగా
నీతి యహింసయున్, గలిగి నిగ్గులబొట్టు ధరింప జేయగా
లేత స్వరాజ్యరాజ్ఞి కచలించె మనంబుల పెండ్లికూతురై.

సరస నిలిచిన మహాదహింసాభుజిష్య
కన్యకామణి కరపరిగ్రహణకాంక్ష
బ్రమసి వచ్చిన రాజలోకమును జూపి
యోలి వివరింపజొచ్చె నొక్కొకని చరిత.

పెంచిన గాంధి మునీంద్రుని
దంచ న్మధురాస్యబింబ హాసద్యుతి లో
పించిన పరిణయ మనుకొని
పంచానన మధ్య ఖేదపడియె నెడందిన్.

# స్వ యం వ ర ము

శాసనసభలలో సభ్యతాపదవికై
　　వింత సంస్థలను స్థాపించువారు
కాలానుసరణంబుగా తొండలనుబోలె
　　మాటిమాటకె రంగు మార్చువారు
యుద్యోగమూడగా యుక్కు రోషముతోడ
　　నట్టింటిలో జిచ్చు పెట్టువారు
నిమ్న జాతులమీద నిప్పులు చెరగుచు
　　విధిలేక కన్నీరు విడచువారు

చిరుత విధవల కన్నీటి వరదలంచు
హాయిగా కుమాళ్ళకు పెండ్లిచేయువారు
వచ్చియున్నారు నీ స్వయంవర జిగీష
బిడియములు మాని ముదిపెండ్లికొడుకులగుచు.

ఎంతటి వృద్ధుడుం బరిణయేచ్ఛకు నగ్గముగాకపోదహో
యింతి, భవత్స్వయంవర మొకించుక వీనులు సోకినంతనే
పంతము మీరగా నడచివచ్చెద రల్లదె చూడుమమ్మ యే
క్కాంతుని కొంచెచేతలకు కట్టులపైబడి కాటియాత్రికుల్.

# స్వయంవరం

ఆగాఖానుడు పాటిగాడితనితో నైశ్వర్యసంపత్తి ని
న్నూగింపంగల దెల్లిభోగముల ముందుల్లంబు లేకుండగా
లాగుం బేదల పచ్చిమాంసమును బాలా ! జంటవడ్డీలనీ
సోగల్దీరిన వాలుకన్గవ చెమర్పన్ వీని వీక్షించినన్.

అనువారంబును దేవపూజలకుగా నర్థంబు వెచ్చించి, చే
సిన పాపంబు హరించిపోయెనని హర్షించున్ మహర్షీంద్రు డి
చ్చిన సందేశము విస్మరించి, ప్రతిమల్ జెక్కించి యమ్మించు నీ
కనుకూలించిన జూచుకొమ్ము శుభనేత్రా ! వీని సంబంధమున్.

తెలవా రేర్పడి సేయునా డితడు మంత్రిత్వంబు సాధించి, యా
ప్తులకుం దగ్గరిచుట్టపక్కముల కుద్యోగంబు లిప్పించి, య
న్యుల కన్యాయముచేసినా డనుచు విందుస్ వర్ణవిద్వేషముల్
పుట్టై, యెంతటి సత్కారముల గొంతుల్ నొక్కి శిక్షించెనో !

అటకాయించెడు శాసనాల చెవు లల్లాడించుచున్ బ్లాకుమా
ర్కెటు సాగింపు బెహారి మిన్న యిత డార్పెన్ బెక్కుసంసారముల్
జిటికెండంత దయారసం బితని కుక్షిన్ జీర్బినన్ గాన మి
క్కుటిలుం డుత్తమ దేశభక్తుడని పల్కున్ బత్రికారాజముల్.

# స్వ యం వ ర ము

కనుగొమ్మ జలతారుటంచు తలపాగాదాల్చియున్నట్టి న
ల్లని యాసామి నతండు కొండొక దివాలాఖోరు, జాతీయ సూ
తన సంరంభము వర్ణనాకలిపు సంస్థారాజమం బాగ్రహిం
చిన హిందూమతమువ్యాపాయి, యిపు డాశించున్ స్వరాజ్యార్థముల్

మురవిధ్వంసకుడున్న దేవళమునన్ బూజారిగానున్న భూ
సురముఖ్యుండదె రత్నకుండలపు రోచుల్ దట్టు మిట్టాడ నీ
వరబింబాధర ద్రాక్షాపానకము నాస్వాదింపగా వచ్చె సుం
దరి ! పూజారిణివై సుఖింప లెనన్నన్ వీని బెండ్లాడుమీ !

మానవుడై యితం డెదిరి మానవులంగని గుర్తుపట్టగా
లేని విమూఢచిత్తుడు చలింపడు వీని మనస్సు లోక మే
మైన, కృపారసంబు నడయాడని వీని కఠోరదృష్టిలో
బూనుచునుండు పంచశర భూతముశేమల దర్శనంబున్.

తాలూకా కధికారియై ప్రజల రక్తంబాని మర్యాదగా
కాలంబీడ్చినవా డతండు బిరుదుల్ గాజేసి, యీనాడు స
చ్ఛీలోక్తుల్ వచియించుచుం గదలివచ్చెన్ జూడు మాబుబ్బిమీ
సాలున్నాతని తాల్చినా డిపుడు సాక్షాదాంగి లేయాకృతిన్.

## స్వ యం వ ర ం

శ్రీవిద్యావ్యతిరేకవాదములు కాశీదాక బారించి, మి
ధ్యావేదాంత మహాసముద్ర జఠరాంతర్మగ్న భగ్నాత్ముడౌ
నీవర్ణాశ్రమధర్మకర్మ నిరతుం డేతెంచె బెండ్లాడగా
నీ వాల్గన్నులలోన నెంతటి స్మరాగ్నిజ్వాల లేపారునో!

వైకుంఠ మ్మరచేతఁ జూపగల తత్వజ్ఞాతపీఠాధిపుం
డాకన్పట్టు ప్రలంబగర్భుడు, త్వదీయాపాంగ వీక్షాలవ
స్వీకారార్థము వచ్చెనమ్మ! యతనిన్ జేపట్టినం బాపముల్,
పోకన్నేరవు నిన్ను, లభ్యపడవచ్చున్ బొందితో స్వర్గమున్.

మతమొక కంచుకోటవలె మానవదుష్కృతి గప్పిపుచ్చి, యం
చితమగు నైకమత్యమును చిందరవందరజేసి, భిన్నదై
వతములనీని, సంకుచిత భావములం బురికొల్పి, స్వార్థదూ
షితులగు పీఠికాపతుల జీవితయాత్రకు తోడుసూపెడిన్.

ఇరుదెగల్లై, పెడ మొగముల
పరస్పరము కలహమాడు పంచములకు వా
డెరుసుం బోకడ గరపెడు
హరిదాసుడు, దాసుడెల్ల యవగుణములకున్.

# స్వ య ం వ ర ము

పొగలెగజిమ్ము శాత్రవము బొజ్జలలోపల డాచి, మోముఁలన్
నగవు లలంకరించుకొని నాటకమాడెదు లౌకిక బ్రువుల్
భగవదఖండ ప్రేమవిభవంబును నిత్య ముపన్యసింతు రీ
సగము మనుష్యులే, యధికసంఖ్య సుమీ మతధర్మసంస్థలన్.

కులములవారిగా ప్రజలకున్ మరియాదలు పంచి పెట్టినం
గలహము లుండబోవని యొకానొక వర్గమువా రుపాయముల్
బలుకుదు రైకమత్య బలవర్ధనరజ్జువునుండి భిన్నమై
తొలగిన నూలుపోగులకు తోరపుచిక్కులు రాకపోవునే.

అచ్చోగాంధిమృతిం దలంచుకొని మిథ్యాబాష్పముల్ సిందుచున్
ప్రముచ్చుల్ కొందరు మూగినారరయుమంభోజాక్షి, వారెల్ల నీ
వచ్చంబడ్డ స్వతంత్ర భారత సుఖస్వర్గంబునన్ జల్లగా
చిచ్చుం బెట్టు విషస్వభావులు శిలాచిత్తుల్, ప్రజాభక్షకుల్.

ముదముల్ గూర్చెడుతత్సుఖంబెఱుగకుబ్బున్ గర్వముంగూర్చు, సం
పదప్రత్యంగము నావరించుకొని సామ్రాజ్యంబు సాగింపగా
కొదమేనుంగు విధాన నీ కెదురుగా గూర్చున్న పిశ్వారి, నీ
మృదుబింబాధర మానవచ్చె కను మింతీ! యీడుజోడైనచో.

# స్వ య ం వ ర ం

నూతనరాజ్యముల్ పదులు నూరులు బుట్టి గతించిపోయినన్
తాతలనాటి పచ్చిబురదంబుడకొట్టుచునుండు కుంభజ
భ్రాతను జూడుమమ్మ! ప్రతిభాసముదగ్రములైన నీ కళా
జ్యోతులు మాన్పలే వితని చూపుల, సంకుచిత స్వభావమున్.

కులదర్పంబుల మర్దళధ్వనులతో కూపస్థమండూక జా
తులు ఖండాంతర సంస్కృతిం దెగడుచన్ దుష్టిం బ్రదర్శించుచో
తలవంపుల్ గద నీచరిత్రకు, పవిత్రంబైన నీ మూడు వ
న్నెల జెండాల కళావిలాసములకున్ నీ సభ్యతా స్ఫూర్తికిన్.

అని పల్కుచున్న నెచ్చెలి
గనుగొని విరమింపుమంచు కనుగొల్కుల నిం
డిన యశ్రుజలము నల్లన
కొనగోటం జిమ్ము పెండ్లికూతుం గనుచున్.

వేదికకు నెడముగా మేల్
ఖాదీ ధరియించి వేడుకంగను గాంధీ
పాదాంకచరుల జూపుచు
దాది మరల చెప్పసాగె తరళోక్తులచే

స్వ యం వ ర ము

కలధనమాత్రయుం గాంగి గండు దరిద్రత చుట్టుముట్టినన్
దలకక బందిఖానల వ్యథామనదంతుల నోర్చి ధీరులై
నిలిచిన శాంతిదూతల ననింద్యచరిత్రుల జూడుమమ్మ నీ
వలపుల కౌగిలింతలకు వన్నెలు దేగల దేశభక్తులన్.

ఆడంబరములేని యాదర్శజీవితా
 భ్రమున కాంతం దబ్బిబాంధవుండు
వలదన్న వెనువెంట బడ సనాతనమైన
 కటిక చీకటికి ఖడ్గం బతండు
ఉదరింభరతకు చేయూతలు గల్పించు
 మతమున కతడు శాశ్వత విరోధి
కాసుచేయని యద్దకపు వర్ణముల పురా
 రభస కితడు మంచి రజక రాజు

జీవకారుణ్య మకరంద జీవఝురుల
కాలవాలంబు లితని నేత్రాంచలములు
నీకు నచ్చిన మగవాని, నీతిపరుని
నేరుకొనుమమ్మ! కలికి బంగారుబొమ్మ?

## స్వ యం వ రం

ఆమాటలు విని కన్యక
యేయనుమానంబుదట్టి యేమనుకొనెనో
రోమాంచము సోకనిదై
మోముమలపి వేడియూరుపులు పొగలెగయన్.

జలజల నశ్రువుల్ ధరణిజార, స్వరాజ్యము పుష్పహారమున్
నలిచి, వివాహమంటపమునం బడవైచి, వరాళిచిత్తముల్
కలతవహింప నందియలు గజ్జెలు తీవ్రముగా నటింపగా
నిలయము సొచ్చెనంత రమణీమణి, దుఃఖముతో, నిరాశతో.

ఆవైవాహికవేదికం దొలగి కన్యారత్నమట్లేగ, కో
పావేశంబులతోడ పెండ్లికొడుకుల్ వ్యర్థప్రలాపుల్ వధూ
లావణ్యంబు హసించి, మోపిరి కరాళంబైన నిందోక్తులన్
వేవేలోటమి సమ్మతింపదుగదా స్వీయాసమర్థత్వమున్.

నాకన్న నీటుగాండ్రను గోరునోయంచు
        నూర్చె కొండొక్క లంబోదరుండు
పక్షపాతపు స్వయంవరమంచు క్రుద్ధుడై
        గొణిగె వేరొక దగాకోరు మౌళి

# స్వయంవరము

పదుగురిలో నవ్వులాటంచు తలయూచి
చనియె నింకొక రావుసాహెబుండు
లజ్జావమాగ్ని యుల్లమునేచ లేచి మో
టారెక్కె నొక సాహుకారిమిన్న

విషము వెలిగ్రక్కు చూపులు విస్తరించి
హాసమొనరించె నొక యున్నతాధికారి
నా సమర్థత తెలియగదీ భాసురాంగి
బేల లెమ్మనె నొక్క వకీలుబేల.

సాంకర్యంబు సహింప నేరక జ్వాలజ్వాలాభమై, కర్మపున్
సంకెళ్ళన్ దొలగించు వేదమతసంస్థల్ నేడు ఛండాలపుం
బంకానంబడి, దీనిమూలమున నానా కూళ్ళు భక్షించెడిన్
సంకోచించెద రేల లెండని సభాస్తారుల్ సరోషాస్యులై.

అభిజాత్యంబు, కలిమి, విద్యావిభూతి
తగిన హోదాలు గల సాంప్రదాయకులను
మమ్ము గాదని యీగాంధి మనుమరాలు
కాపురంబెందు వెలిగింప గలుగు నింక.

# స్వ యం వ రం

అనుచు నైరాస్యకోపతామ్రాక్షు లగుచు
నాసనంబులు వీడి, సభాంతరాళ
గురు శతఘ్నిక చిమ్మినగుండ్లు వోలె
వెడలివచ్చిరి మస్తముల్ దడవికొనుచు.



# దే శా ట న ము

తన వీలునామయందున్
మునిముఖ్యుడు వ్రాసి చన్న మూర్తిత్వంబున్
గొనములు గల పెవిమిటికై
ననబోడి చరించె నేల నాలుగు చెఱగుల్.

కులవిద్యా ధనములచే
తలనిక్కినవారి దెగడి, ధర్మోద్ధ్వగులై
కులవిద్యా ధనములచే
తలవంచిన వారికొరకు తరుణి చరించెన్.

## స్వయంవరం

మునిముని మీసపుం బొగరు పొంగులువార ప్రవృద్ధమానమౌ
తునకగలట్టి యౌవనుల తోరపుటుచ్చుల కంది చాపులన్
మనమును సాగనీక, పరిణామ వికారము లంటనట్టియౌ
వనముగలట్టి శీలమును భామవరించి చరించె దేశముల్

చెలికత్తెల్ వెనువెంటరా దిరిగె కాశ్మీరంబు పంజాబు నా
వల బంగాళము దక్షిణోత్తరదిశా పర్యంత భాగంబులన్
బలవర్గాల వివాద మోహములతో వంశ ప్రతాపాలతో
తలక్రిందైన విశాల భారతము ప్రత్యక్షించె నున్మత్తమై.

జంబూ ద్వీపంబునకున్
జాంబూనద భూషలైన జనపదములు, గ్రా
మంబులు పక్కణములు పా
దంబులు కందంగ దిరిగె దయితుని కొఱకై.

లంబినీవనము లాలాపించు బుద్ధుని
జాలిగుండియల కంజలి ఘటించి
రాణాప్రతాపు డారావళీ గుహలలో
నిడుములందిన సీమ లెల్ల నరసి

# దే శా ట న ము

శివరాజు పులిగోళ్ళ చెండాడి పగవాని
యుసురు దీసినచోట నుమ్మలించి
జనియను వాలాఖ్యవనము లాహుతిగొన్న
నిరపరాధులకు కన్నీరుసల్లి

స్త్రీలపాలిటి ప్రత్యక్ష దేవుడైన
రామమోహనరాయలు బ్రహ్మసమితి
కంకురార్పణ చేయు దివ్యస్థలాలు
దర్శనము చేసికొని భామ తనివిజెందె.

ఇక్కడ సాంఘికశ్రమ సహింపగలేక టిబెట్టు భూమికిన్
బొక్కిన కాళ్ళతో నడచిపోయిన రాయనిపాదయుగ్మమున్
మక్కువతో ధరించినది మస్తమునన్ మహిళాజగం బితం
డెక్కిన కొండలెక్కి యెద తృప్తి వహించె లతాంగిభక్తిమై.

బొట్టుంగాటుకలేని వృద్ధుని బలంబున్ నమ్మి స్వేచ్ఛార్థమై
కట్టుం బట్టలతో నిరాయుధముగా కయ్యంబు సాగించిరా
ట్పట్టంబున్ గడియించి స్వర్గ పదవిం బ్రాపించు జాతీయ పుం
జుట్టాలం దలపోయ కన్నుగవ నశ్రుల్ నిండె తన్వంగికిన్.

# స్వ యం వ రం

భాషాభేదముచేత మానవకుటుంబ శ్రేయమూటాడగా
వైషమ్యంబులు వృద్ధిజేసికొని ప్రాప్తంబైన స్వేచ్ఛారమా
ఘోషన్ జిక్కులపాలుజేసికొను రాష్ట్రోన్మత్తులం జూచి హ్రీ
భూషాలంకృత సిగ్గుచేత వదనంబున్ వంచె దామ్రాక్షియై.

వంగము జేరి విశ్వకవివర్యుని విశ్వకవిత్వ సాహితీ
భంగిమ లన్యదేశముల ప్రస్తుతులం గొనితెచ్చె, దేహ ము
ఖ్యాంగ స్వతంత్ర భారతికి పూజలు సల్పుట లాకళించి, సా
ష్టాంగ నమస్కృతుల్ సలిపె హర్షనిమీలిత లోచనంబులన్.

బోసుబ్రద్దలుకొట్టి బోసుబెబ్బులిపిల్ల
కన్న భూములు వాసి చన్నచోటు
గంగాధరుడు వీరగంధంబు మైదాల్చి
స్వచ్ఛంద బీజముల్ సల్లుచోటు
లజపతిరాయి కీలాలంబు చవిజూచి
సీమక్రోల్బులి సంతసిలిన చోటు
వేనవేల్ వర్షించు ప్లీడరీపట్టంబు
చిత్తరంజనుడు వర్జించు చోటు

# దే శా ట న ము

బాల్యమున యందు జిహ్వారుపండితుండు
తండ్రితోగూడ జాతీయదళమునందు
ఖదరు దాలిచి యోధుడై కదలు చోటు
బాల పరికించి, గర్వ సంభరితయయ్యె.

ప్రత్యేక రాష్ట్రమునకై
వ్యత్యస్తావేశ రభస లడ్డమురాగా
నిత్యము పోరాడు కళా
దిత్యుల కాంధ్రులకు భామ దీవెనలిచ్చెన్.

మతము కతనసాటి మనుజుల కెడముగా
బ్రదుకుచున్న ప్రజల హృదయమందు
బందియైన మానవత్వంబు పోరు గా
వించు గుట్టు గోచరించె సతికి.

వేష భాషలు తొలగించి వేయు నెడల
ఖండఖండాంతర ప్రజాకాండమందు
నంతరములేని నగ్న సత్యము గ్రహించి
కన్యకామణి ప్రజల కుపన్యసించె.

# స్వయంవరం

ఆతిథ్యంబును స్వీకరింపుమని యాహ్వానించు ముత్తైదువుల్
చేతుల్ సాచి 'జయోస్తుతో' యనుచు నాశీరక్షతల్ సల్లుచున్
జాతీయాంగన లిచ్చు కాన్కలు భుజిష్యల్ జేతి కందీయగా
స్వాతంత్ర్యాంగన దర్శనం బిడియె యావద్భారత క్షోణికిన్.

పేరుల్ మారిన పట్టణాల్ జనపదాల్ వీధుల్ శిలా విగ్రహా
లారామంబు లడావిడుల్ గలిగి బ్రహ్మానందముగా గూర్చు హిం
దూరాజ్యంబున దీనమానవుల గొంతుల్ బిండి లాభాలతో
పూరా పడ్డ కుబేరులం గనియె నంభోజాక్షి తత్పాత్రమై.

నిండారు శాంతితో, నల
గొండా భయ ముడిగి, కన్నుఁగుర్కిన నైజాం
ఖండా వాసుల గని వే
దండ గమన సంతసించి తనివి వహించెన్.

అల బ్రహ్మయంతవానికి
సలాము గావింపవట్టి సమ్రాట్టు నిజాం
సుల్తాను డిచ్చు విందులు
చెలికత్తెలతోడ భామ స్వీకరించెన్.

# దే శా ట న ము

చండాంశు కాఁతితో, బ్ర
హ్మాండంబున కళఁకమనుచు, నాకసమున గో
ల్కొండలపై శోభిలు తన
జెండా నీక్షించి భామ శిరము గదల్చెన్

ఇటలీభాషవిధాన కష్మ్రనయి, మున్నే బ్రౌను చిత్తంబు గు
ప్పట సంధించిన తెల్గుచక్కదనమున్ బెంపుఁ బ్రశంసించి యా
కటిపెల్లూడని గ్రంథకర్తల యభాగ్యశ్రీకి జింతించి బా
పట గల్పింతునటంచు నిం డభయహస్తంబిచ్చె, సంశప్తయై

అట్టుల దేశదేశముల యర్చనలందుచు, కూటిపేదలై
బట్టలులేక యెండలకు వానలకోర్చి, స్వరాజ్య మేదియో
పెట్టి సముద్ధరించునను వెఱ్ఱికి లోనయి, జీవితంబులన్
నెట్టు యభాగ్యులం గనియె నిండిన బొజ్జలవారి పజ్జలన్.

వచ్చె స్వరాజ్యలక్ష్మి మనపల్లెలకన్న కులాసమోములం
దచ్చుపడంగ, రాచమరియాద లెఱుంగమి, జీర్ణవస్త్రముల్
విచ్చిన కొప్పులుంగలిగి పిల్లలు జెల్లలు గోలచేయగా
వచ్చి నమస్కరింపకయ ప్రశ్నలువైచి రనేకరీతులన్.

## స్వాతంత్ర్యం

ఇదిగో! స్వచ్ఛ స్వరాజ్యం
అదిగో! యని భారతీయు లాశించిన య
భ్యుదయాపాదిని, కటకటా
హృదయా: కొనుడమ్మ యీదరిద్ర స్తవముల్.

తొలగిపోయినారు దొరలిక మనవారి
దొరతనాన నేగి దొంగపంక్తు
దొరలు దాటిపోవ దొంగలు మిగిలి రా
వృద్ధియైన నేగికేమి కతము ?

తమదీనస్థితి విస్మరించి మతసంస్థల్ నెప్పు గమ్మత్తు భా
గ్యములన్నమ్మి, శరీరకష్టమున లబ్ధంబైన యర్థాన్న లా
భమునన్ దృప్తివహించి, గంపెడు కుటుంబంబున్ భరాయించు త
చ్ఛమజీవుల్ లలితాంగిలో జొనిపి రారాటాగ్ని గోళంబులన్.

కుశల ప్రశ్నము చేయుచు
విశేషములు పృచ్ఛ నేయు స్వేచ్ఛా సతికిన్
విశదముగ జెప్పి రెడదల
యశాంతి యావేదనంబు లధిదైవతముల్.

# దే శా ట న ము

హరిజనులచేతి నైవేద్య మభిలషించు
వేల్పులమగు మా విశ్వవిహితసమత
భ్రష్ట మొనరించి రమ్మ! దైవముల బ్రదుకు
కటకటా! నేడు సంశయగ్రస్తమయ్యె.

శాపముచేత శిల్పుల ప్రశస్త సమత్కృతి జేసి, యేదియో
రూపముదాల్చియుందుము, నరుల్ దల బ్రద్దలుగొట్టుకొన్న నా
లాపము లాడ జాలము శిలామయముల్ దినువుల్ కదల్పగా
నోపికలేక క్రుమ్మరెద ముత్సవవేళల వాహనాలపై.

అంటంగట్టిరి వాహనంబులని మా కాబోతులన్ దున్నలన్
గంటల్ గజ్జెలు గట్టి, క్షుద్రమగు నానాజంతు సంతానమున్
జంటల్ జంటల నాంశ్ర నాత్మజుల నీ సంసార కూపంబులో
కంట న్నీరిడుచున్న మే మొకరి పంకంబెట్టు వారింతుమో.

నైవేద్యంబుల నారగించితిమి నానావర్ణముల్ పెట్టగా
మావల్లన్ ఫలమించుకంతయును సంప్రాప్తింపదే దేరికిన్
మా వైశిష్ట్యము మా ప్రభావ మనుచున్ వర్ణించి దేశంబునం
దావేశంబు రచించు భక్తుల కదమ్మా, మా భటాగ్రేసరుల్.

# స్వ య ం వ ర ం

ఆదర్శంబులు గాంధి జీవిత చరిత్రార్థంబు లాశాంత శాం
త్యాదిత్య ప్రభలర్చనీయము లటం చాకాశవాణి ముఖ
ప్రాదుర్భావ విదేశ సంపత్తులు శ్రావ్యంబై నినాదింపగా
దాదుల్ దాను భజించె కంచుకితగాత్ర స్వార్గికానందమున్.

బహిరాడంబరదంభ గౌరవమునం బాటించి దారిద్ర్యపుం
దహనంబున్ దరికొల్పి చన్న దొరలన్ దద్గౌగవస్థాన దూ
ర్వ్యూహమ్మై పాలనచేయు నాధునిక మంత్రంబున్ విలోకించి య
మ్మహాదాదర్శచరిత్ర తేల్చుకొనె నాత్మన్ దారతమ్యంబులన్.

అడిగిన స్వీయ రాజ్యమున కడ్డులు చెప్పుచు నేబదేండ్లు పె
క్కుడమలు పెట్టి తుట్టతుదకిచ్చి తొలంగిన తెల్లవారి చి
క్కుడమగు రాజనీతికి నఖండ మనోధృతికి స్సమ్మదశ్రువుల్
విడిచి ప్రశంస చేసె నరవింద నిభాస్య విశాల చిత్తయై.

కాంక్షింతు మొక తటాకంబంచు మొరబెట్టు
రాతి ప్రాంతాలు సర్వము చరించి
వ్రాసికొన్నా మమ్మ! రహదారి కొలికంచు
బరువెత్తు సీమల బాదమూని

# దేశాటనము

కొలత గింజల బాధ దొలగించి పొమ్మంచు
గోల పెట్టెడు పట్టణాల నరసి
క్షేత్రాలు పంచి యిచ్చిన గాని కాదను
సత్యాగ్రహుల మహజరులు చూచి

స్వీయ రాజ్యార్థమై యిచ్చు సెలవునాడు
పెరటి బేరాలు సాగించి ధరలు బెంచు
మాయ మార్కెట్లవారి గమ్మత్తు లరసి
దేశభక్తుల కన్నీట దేలిపోయె.

అవినీతి ప్రబలెనని, పె
ల్లవినీతికి బాలుపడెడు నటునిటు గాంచెన్
గువలయ కంటకులంగని
కువలయహిత మనసు పగటికువలయమయ్యెన్.

బలమైన మిత్రమండలిసేన సెలవంది
సీమకు పయనంబు చేయునాడు
అతినిరాడంబరంబైన రాజసముతో
ఖదరుజెండా మింట గదలునాడు

# స్వయంవరం

అధికార దండంబులంది మంతురు లెల్ల
సింహాసనము లధిష్ఠించునాడు
అనళప్రతుని తాతయశక్తి దలపోసి
సుర లద్భుతంబంది చూచునాడు

ఏయుదాత్త దృష్టి, యేసామరస్యంబు
ప్రతిపదార్థమందు ప్రతిఫలించె
సన్నగిల్లె నాటి చైతన్యమని భామ
యశ్రుపూరితాక్షియై, తపించె.

పరమతపోధనుల్, సుకవిపండిత మండనులల్లి చన్న సా
గరసమమైన వాఙ్మయముగల్గిన గడ్డలుగన్న కాన్పులై
హరిజనులన్న ముట్టదగనట్టి వ్రణంబు కుదర్పరానిదై
పెరుగుట దుస్సహంబని తపించె వధూమణి మానసంబునన్.

హాలము రవంత సోకిన సుధాన్నపురాసులు గుమ్మరించు భూ
తలసతి, యన్నపూర్ణ గళదఘ్నదరిద్రత వస్త్రహీనయై
నిలువున నెండియున్నదయ నీయపరిస్థితి కంతరంగమా
కులపడ జింతచేసె ననుకూలములైన సహస్రమార్గముల్.

# దేశాటనము

ఐశ్వర్యమదము మనుష్యత్వంబు మఱపింప
దయ దప్పియున్న నేత్రములవారు
ఆచార కవచంబు లభయహస్తము జూప
తెరచాటు నేరాలు జరుపువారు
పట్టభద్రత్వంబు వడసి సామాన్యుల
చెలిమికి దూరమై చెడినవారు
తాత తండ్రుల భుజాదర్పాలు వర్ణించి
అధినేతృలకు పీకులాడువారు

నిన్న చెల్మిజేసి నేడు విరోధులై
చిత్రవిచిత్ర ప్రకృతి జెలగువారు
ప్రకృత నాగరికత పదిమాసములు మోసి
కడుపు చల్లనడగ గన్న సుతులు.

ఒకదెస మానవత్వము సహోదరభావము లాగుచుండ, నిం
కొక దెస కాదు కాదని మతోగ్ర పిశాచి బలాత్కరించగా
వికల విభిన్న వేషములు వేసి చరించు ననంతకోటి వా
గ్రికరసహీన జీవిత పరిస్థితు లాత్మగలంచె భామకున్.

# స్వ య ం వ ర ం

మగడు గతించె నంచు నొక మాటలు రానటువంటి బాలకున్
జిగురు శిరోజముల్ నరికి, సిగ్గు ఘటించి, ముసుంగు వెట్టి, సో
యగమును హత్యజేసెడు భయంకరచర్య, యనార్యతామహా
మృగవికటోగ్రచేష్టయనిని యింతి మనస్సు గలంచె నెంతయున్.

హరిజన వాడలం దిరిగి యచ్చటి కష్ట చరిత్ర గుండెలన్
నరుక, విషణ్ణ ర క్త వదనంబున నశ్రులు జింది, దేవమం
దిరములు సొచ్చి, పూజరుల నీతివిహీనత కన్నులార గా
నరసి, గ్రహించె నందు పరమార్థము, పూజలలోని పుణ్యముల్.

అలుకన్మాలల పేరునంబసుల యందావేశరోషంబులన్
మొలిపింపంగనవాచ్యముల్ బలుకు హిందూసంఘమున్గొల్పుచున్
కలతంజెందని పంచమీయుల యభాగ్యత్వంబు నూహింప, గుం
డెలలో మెండుగ నగ్నికుండలము లు మండెన్ గాంధి దౌహిత్రికిన్.

ఒకచో వర్ణవివాదకారణముగా నుద్రేకులై దెబ్బలా
టకు దట్టీలు బిగించు మూర్ఖుల గలాటాజూచి, చింతించి, యం
తికమందున్ మధుర స్వభావములతో తేడాలు లేకుండ బా
లకు లాటాడుట జూచి నవ్వుకొనె నుల్లంబందు సంతృప్తయై.

## దేశాటనము

భగవత్పూజా నెపమున
నగణితముగ జంతుహింస లాచారముగా
యుగములు తరబడి నెరపెడు
తెగలంగని భామ గుండె తెగి రెండయ్యెన్.

పసిపాపలకస్వర్గసుపదవిగా కన్నుల
కందఁబోఁగసి యేసు దన్నమాట
అధిపుండ నన్నవా డధమాధముం డంచు
మతము లుద్ఘోషించు మంచిమాట
సహనంబు సర్వవిశ్వము నేలగలదంచు
గుజరాతుముని మొత్తుకొన్న సూక్తి
ఆశయే దుఃఖాల కాది కారణ మంచు
శాక్య సింహుండు పల్కి చన్న హితవు

స్వార్థపరమైన కపట రూపములు దాల్చి
సకల దిక్కుల నాట్యంబు సలుపుచుండ
కంట తడిపెట్టు గాంధి విగ్రహము నరసి
కోమలాంగికి చిత్తంబు క్రుంగిపోయె.

# స్వ యం వ రం

నలుగు బెట్టవచ్చు నవయుగాంగనలతో
చెలిమి నెరపి కలసి మెలసి తిరిగి
వెడలి రాక వారియెడదగాయము చేయు
నభిమతంబు లెల్ల నాకళించె



# హిమగిరియాత్ర

వారాణసికింజని, శివు
నారాధన చేసి గంగయందు మునిగి కాం
తారములు గడచి, హిమగిరి
చేరువ నొక రమ్య వన్యసీమకు జనియెన్.

ఆళియుగంబుతోడ గమనాలసయైన స్వారాజ్యరాజ్ఞి య
హ్వాల వనంబునం బదము మోపిన యంతన జాతి వైరముల్
దూలి, మృగావళుల్ జెలిమితో విహరించుట జూచి జంతువుల్
మేలు సుమీ ! మనుష్యు నుపమింపగ నంచు దలంచి రంగనల్,

# స్వ యం వ ర ం

స్వాగతమిచ్చె కోకిలము చక్కఁగ బూఁచి, పరిమళించు పూ
దీగల నూగుచుం భరతదేశ తపఃఫలమైన కన్యకున్
కాగల దానికిన్ బ్రజల కష్టములం గడతేర్చు దానికిన్
త్యాగుల ముద్దు బిడ్డకు మహాత్ముని ఖద్దరు యాజ్ఞ సేనికిన్.

తీయని పండులం గుడిచి దీర్ఘమహీరుహ విస్తృతచ్ఛద
చ్ఛాయల విశ్రమించి, శుకజాతము ముచ్చట లాడుచుండి, స్వే
చ్ఛాయువరాజ కన్య కగచాటులఁ వచ్చెనటంచు, "రామ ! రా
మా !" యను పల్కులం దెలిపె నాదరణాంచిత సానుభూతులన్.

అవనసీమలందు గుసుమాంజలిబట్టి మరుత్కుమారకుల్
సేవలు సేయ నెచ్చెలులు శీతల వాక్కుల నూరడింపగా
త్రోవగమించినట్టి శ్రమధూతముగా వడదేరి, శాంతికిన్
దావిడ కేచుచున్న యలదారుణ దృశ్యములం దలంచుచున్.

కబళించునో ! పరాక్రమము నుంతువ జేవి
క్రమ్మర నాంగ్లేయ ఖడ్గసేన
బంధించునో ! మత వ్యాజంబు గల్పించి
చీలిపోయిన పఠాణీల పౌజు

## హి మ గి రి యా త్ర

కారించనో! యగ్నికణములు వెదజల్లి
నాలిగూండా గొరిల్లాల దండు
వెతల పాల్సేయునో! పతకంబు నూరిచి
తెరదప్పవచ్చు రాష్ట్రీయపృతన,

వలచి వచ్చినట్టి వరులలో నాదృష్టి
కాని నట్టివరుని గొనవైతి
మగడు లేకయున్న మగువ రాణించునా!
చక్రవర్తి యింట జననమయిన.

జననంబందితి, దేశభక్తుల యహింసా యుద్ధరంగంబునన్
దనువుం బెంచితి గొన్నినాళ్లు భగవద్గాంధీ కరాబ్జంబులన్
ఘనతం జెందితి; దేశదేశ రసనాగ్ర స్వర్ణపీఠంబులన్
ననబోండ్లార? విపత్పరంపరలు గన్పట్టున్ భవిష్యంబునన్.

ఆకలిదప్పులుం వెఱవు లాసఁ డాయని యట్టి సత్య ధ
ర్మైకసమీక సాహసుల నింద్రియనిగ్రహవేత్తలైన, శు
శ్లోకుల పెండ్లికూతునకు శోకముకూడదు రాచబిడ్డవై
ప్రాకృత కాంతవోలె నెదపందురు దమ్మ! స్వరాజ్య కన్యకా!

# స్వయంవరం

నిండుగ దెల్లవారి రమణీయ విభాకర బింబదీధితుల్
పండుపసిండినీరుచయ పర్వతభూముల జల్లలేదు, ప్రా
చ్యండతమో వికారపు నిషాపసదగ్గనిగడ్డలో, సుధా
ఖాండము జిక్కలేదనుచు వందురు దెంతటి పిచ్చిపిల్లవో!

చిన్నతనంబు నీది, హృది చిన్నది, నీపదమూను పీఠ మ
త్యున్నతమెల్ల దేశముల నుండక పోవవి నీతిభూతముల్
సున్నితమైన నీ హృదయశుద్ధికి జోడగు జీవితేశు డు
త్పన్నమునందకుండడు ముదంబు ఘటింపకపోడు నెచ్చెలీ!

నీ వాశించిన కొత్త్రాపురము గాంధీ భస్మ దేహంబుతో
దేవావాసము జేరిపోయినది, తద్దివ్యాశయశ్రేణి, నా
నావేషాలు ధరించి లోభుల మహాంతర్నాట్య రంగంబునన్
గావుంబట్టి నటించుచున్నది భయోత్కంప క్షమాదేవతన్.

కాలము గారడీనివలె కల్పనచేయఁగలేనిదేది! యీ
కాలములో గవర్నరులుగాదె యొకానొకనాడు ప్రాతకే
డీలు! లతారగి! యిప్పటికడింది జగత్త్రొకనాడు మెత్తనై
వాలకపోవదభ్యుదయ వర్ధకమైన భవత్ప్రదద్వయిన్.

చక్రవర్తిని, నిమేషమున భృత్యునిజేసి
మిడసిపాటుననున్న చెడుగు తెలిపి
బంట్రౌతు నొకనాడు పరిపాలకునిజేసి
యధికారగర్వ మద్యం బొసంగి
రూపవంతులను కురూపవంతులజేసి
వైరాగ్య బీజముల్ బాదుకొల్పి
మసిబొగ్గులను వజ్రమణిరాసుల నొనర్చి
తీపికోర్కెలకు పంచశ్శమర్చి

మంచిచెడ్డను, చెడ్డను మంచిజేసి
నిముష వేగాశ్వముల నెక్కి నేర్పుమీర
సృష్టిపై పెత్తనము జలాయించుచున్న
కాలమునకన్న తుంటరి గానరాడు

నేడు, స్వతంత్ర భారతము నిందల పాలయి, దుష్కృతంబు నీ
శ్చాడిన దన్న, శాసన మహాసభలో గుడితోడ లింగమున్
గూడ గ్రహింపగల్గు ఘటికుల్ పదమూనుట హేతువందురో
చేడియ! సమాగమముచే సమయున్ గడకెల్ల లోపముల్.

# స్వయంవరం

సఖుడుం గావలె దొడ్డకాపురము, హస్తంబందు గీలింపగా
వలె, బంగారపు రాశి దండగమును, దీవ్యచ్ఛ్వేత శిలావలో
జ్జ్వల భూఖండము నేలగావలె, మహాసంతానమున్ గాంచగా
వలె, బాలామణి, నిస్పృహోపహతవై [illegible]నోవుటల్ నెల్లునే.

ఇది విజనస్థలంబు, మన మిచ్చట నున్న విపత్తు వచ్చు, నీ
సదమలసంస్కృతిం జెరచి, సంతసమందు వృథాపకారు లీ
పొదలను బొంచియుండ్రు నరమూర్తి వహించిన సింహరాజము
హృదయములేని ధర్మములు సృష్టి యొనర్చు విషప్రచారకుల్.

స్త్రీల యభీష్టముల్ జివికి జీర్ణములై మరణింప గొంతుకున్
దాలి బిగించు సాంఘికపు దానవహస్తము లుగ్రప్రభూత వా
తూలసదాశయ ప్రణయదోహలవైన నినున్ యథేచ్ఛగా
గాలిడనిచ్చునే? వలచు కాంతుని గూరిచి ముద్దు దీర్చునే.

పురుషుల లోభపుం బెను బుద్ధికి లోబడి భారతీయ సుం
దరి దరిదాపులేని సరదా చెరలోబడి క్రుగ్గిపోయెడిన్
దరుణి; స్వతంత్ర భావత రథంబొక బెత్తెడు దూరమేనియున్
జరుగునె? కామినీ పురుష చక్రయుగంబు భరింపకుండినన్.

## హిమగిరియాత్ర

వ్యాకులమందె, పక్షి మృతి కన్నులు రాల్చి కలంబునందు వా
ల్మీకికవిప్రకాండుని, యమేయదయామధురస్వభావ ర
త్నాకరు లద్భుతంబ్రతు భవదశ్వయపుంజుల గర్భశుక్తి. హిం
సాకలనాపురాతనపు జాడ్యము వాపు కుమార రత్నముల్.

ఆమని సామికిన్ వలపుటారతు లిచ్చుచు కంఠ మెత్తి యా
రామము పల్లవింప మధురంబుగ గానము సేయు కోకిలా
భామను బోలి, నీభయము వాసిన రాజ్యమునందు సత్య వి
గ్రామము లాలపించెదరు గాత వినిర్భయ విశ్వగీతికల్.

దట్టంబులగు దేవదారు వృక్షములతో
సురభిళంబైన యుగ్గిరి తటముల
ప్రవహించు సెలయేటి పాయల కిరువక్క
బూచిన గేదంగి పొదలయందు
నిప్పపూదేనె మత్తెక్కి పాటలు పాడు
గండు తుమ్మెదల ఝుంకార రవళి
శ్రుతిగల్పి కెంజేతి రచనాల వీణియల్
మ్రోయించి కవుల్ జగన్మోహనముగ

## స్వయంవరం

నృత్యగాన వినోద పాండిత్య కలన
ధవుళ నలరించు సిద్ధ గంధర్వ సతుల
డెందముల నిండిపాయు నానందలక్ష్మి
కాపురము చేయఁగాక నీ కాపురమున.

తలలో మారుపురాని రీత్తనదువుల్ ధర్మంబుఁ బూజ లెం
దులకీ చీకటి జీవయాత్ర కొక హద్దున్ పద్దు గన్పట్టదా
జెలి ! క్షుద్బాధితమై కరద్వయము సాచెన్ దేశ మేలాటి సం
స్థను స్థాపించి దురంత దుర్ఘట సమస్యాపూర్తి గావింతువో.

అరుణంబైన విరోధి నేత్రమును ప్రేమాయత్తముంజేసి, దు
స్తరసైరాష్య విభావరీమధుర చంద్రజ్యోత్స్న విన్నల్లినన్
దిరిసెంబెత్తితివమ్మ ! శోభిలు ప్రశాంతి చ్ఛాయలో, కీర్తి స్యం
దరి సేవింప రహింపవమ్మ బహుసంతానాంగద భ్రాజవై.

అక్షరజ్ఞానశూన్యతన ధన్యతనందె
భాసురాంగుల చేరదేసికన్ను
తిరిపెంబు మరగి వ్యర్థీభూతమైపోయె
వెయ్యేండ్లు మగవారి వియ్యపుష్టి

## హి మ గి రి యా త్ర

ఊహాతీక్షణయోగ మొక్కింతలేక త్రు
ప్పుంబట్టె దేశీయ బుద్ధిబలము
పక్షపాతపు దృష్టిబారి వృద్ధికిరాక
పతనమైనది పం॥ వంటి ప్రతిభ

అనుభవజ్ఞపు ఖండఖండాంతరముల
వలపు కానుకలందిన భాగ్యశాలి
వాడుకొనుమమ్మ శుభములు పాదుకొల్పి
విశ్వసన్నుతమగు శాంతి విస్తరిల్ల.

కరువై పోయిన వీరలోకమునకై కన్నీరు వర్షించుచున్
గరముల్ మోడ్చుచు మందభాగ్యదశ కింకన్ దావులేకుండగా
దొరికె న్మాకు విచిత్ర దిగ్విజయ వస్త్రశ్రేణి బాపూజిచే
తరమే మ మ్మెదిరింప నన్యులకు రక్తగ్రాహి ఖండాళికిన్.

ఉన్నత పీఠమెక్కి తలయున్ మొలయున్ గురితింపలేని మ్ర
ష్టాన్ను డఖండ పండిత మహాపరిషత్పతియై రహించి వి
స్పన్నయగున్ వచించెడు నదంతయు వేదమగున్ వికారపున్
దెన్నున సాగుచున్న జగతిం దలసూపని వింత యుండునే?

# స్వ యం వ రం

ఆరయనరయంగ మౌనముద్రాంకితమయి
హాయి గల్పించు యీ శీతలాద్రిసీమ
శాంతిసందేశముల పాఠశాలవోలె
నలవరించెడు నేదో రహస్య విద్య.

హాయిగ నిమ్నహాసగ భయంకర సాంద్రవనీవనంబులం
దేయపకారచింత కెడమీని వివిర్మల చిత్తశుద్ధితో
బోయలు వాసముండ్రు శరపూరితతూణధనుర్మఖోగ్ర ది
వ్యాయుధధాతులై, భుజబలాఢ్యులు కొండదొడల్ ప్రచండులై

గురిదప్పని బాణమువలె
గురిదప్పదు వీరి పలుకు గురిదప్పినచో
గురుదైవతముల నేనిన్
పరకుగొన రనాది ధర్మసత్య స్థిరతన్.

మూడిన పీడ నాగరకపుం బ్రదుకుల్ దొరలింప దేహముల్
బాడుగ కిచ్చివైచి బదనల్ బడు పట్టణపుం గమార్ల ప
ట్టూడని దాహబాధ పదమూనదు వీరి గృహాంగణంబులన్
మేపల డాంబికంపు మెఱనిక్కులు టక్కులు వీరి దృష్టికిన్.

## హి మ గి రి యా త్ర

పచ్చిపెదుళ్ళతోటల నవారిగ బండిన ధాన్యరాశితో
నెప్పట చేయిసాచిన లభించెడ పక్వఫలాసవాళితో
లచ్చిని జంక బెట్టుకొని లాస్య మొనర్చెడు నివ్వనంబులన్
మచ్చున కుంగనే కడుపుమాడిన ప్రాణిచయంబు నెచ్చెలీ.

అలతి హింస చేయ దధికార కాంక్షచే
చియ్యబట్టి మసలు సింహరాజు
కడుపు నిండెనేని గర్జింప దెన్నడు
తనివిసననిమేటి ధనికునట్లు.

నడయాడి యెఱుగ వెన్నడు వీరి పాదాలు
ధర్మేతరములైన దారులందు
విని యెఱుంగవు వీరి వీనులేకాలాన
నేలాటి రాజకీయాల గొడవ
కని యెఱుంగదు వీరి కన్నుదమ్ముల జంట
నవనాగరకుల మాంద్యప్రవృత్తి
ఎఱుగ వెన్నడు వీరి తృప్తాంతరంగముల్
ఆశాశరప్రచండాభిఘాత

స్వ యం వ ర ం

అసహజంబులైన యాడంబరంబుల
నంటనీవు వీరి యాకుటిండ్లు
చీకు చింతలేని జీవుల దరిజేర
కుటిల మృత్యువునకు గుండె సున్న.

ముసలితనంబు మృత్యువును ముట్టవు తీయని కోర్కెలూరుమా
నసము గలట్టివారిననునవ్యరహస్య మెఱుంగదీయ స
ద్వ్యసన పిపాసితంబయిన ప్రాకృతలోకము నీర్ష్యసత్తపో
భ్యసనమునన్ లభించు పరమార్ధము గాని యౌవనంబగున్.

తంగేటి జున్నుకై గిరిపథంబుల నెల్ల పరిభ్రమించు, భి
ల్లాంగన మూపునం బుడుత డల్లరిచేయక చిన్ని చేతులన్
నింగికి సాచి సృష్టిరమణిం గబళించెడి వాని స్వర్గమున్
భంగము సేయలేడు భగవంతుడు గూడ వివాద మేటికిన్.

పోకిరిమేఘముల్ దినము బోవుచు వచ్చుచు మస్తకంబులన్
దాకి తగాద రేచిన సుధారసమున్ వెలిగ్రక్కి ఝల్లనై
వ్యాకులపాటులేని హృదయద్రఢిమంబును వెల్లడించుచున్
నాకు హిమాద్రి, గాంధిమునినాథు చరిత్ర స్ఫురింపజేసెడిన్.

# హి మ గి రి యా త్ర

ఎఱకలువిచ్చి మింట జరియించుచు నక్కున క్షుద్రపక్షులన్
క్రఱకు నఖావళిం జెలగి కండలు సొపడుచున్నయట్టి య
గ్గరుడుని రాజకీయములు గర్భ విదారకమై యెడాల్పు హి
ట్లరుని స్ఫురింపజేసెడి కటా! యధికారము లాత్మశూన్యముల్.

కోయిల హాయిగా మధుర కూజితముల్ పచరించుచున్న మా
ర్మ్రోగియుచు వెక్కిరించు నలభూధరగహ్వరపాళిదక్క వే
రే యుపకార మిందు లభియింపదు రక్తపరాయణంబు లీ
లోయల సింహరాజులూ పులుల్ కలవాదము కాంక్షచేయునే.

కమల పుష్పచయము కన్నెత్తి చూడదు
చందమామ మోము చక్కదనము
పేదవాని కళకు పెద్దఱికం బిచ్చి
గౌరవింప దెపుడు కటికజగము

కుంజరంబుల ప్రోత్తుంగకుంభయుగళి
జీల్చి మేధస్సు గమిచి భక్షించువేళ
నవని దొరలెడు మంచిముత్యాల విలువ
హరి యెఱుంగదు, రక్తతత్పరులు నృపులు.

# స్వయంవరం

మంచుశలాక మాదిరిగ మంగలకత్తి విధాన, కొమ్ము రెం
డంచులు సానబట్టుకొని యద్రిగుహాంతరసీమవాసి యే
తెంచు వరాహ ముద్ధతి వధింప నెదుర్కొను బెబ్బులిన్ గదా
యించి పెనంగుచున్నది, సహింపవు దీపులు క్రూరసత్త్వలన్.

అద్రిసెత్తాల మధువు నాప్యాయనముగ
క్రోలుచున్నదీ, యెలుగు నిగ్రోకులంబు
మంచుకొండల శ్వేత సామ్రాజ్యఫలము
సమత లభియించు వర్ణభేదములు లేక.

వలపుం గాటుక దీర్చి గజ్జెలను మువ్వల్ గట్టి పూజించి క
త్తుల పాశ్వేయు మనుష్య సింహముల పొత్తుంబాసి పెక్కాలపుం
దలు జీవించెతి నియ్యరణ్యములలోనన్ బచ్చికల్ మేసి, లే
గలు ముప్పూటలు పాలుద్రావి మదివొంగగన్ జెంగనాల్ దీయగన్

బదరీనాథుని కావలాభటకదంబం బట్లు మార్గస్థులన్
బెదురున్ బెట్టుచు గోపురాగ్రములపై నిత్యంబు క్రీడించు బ
ల్లిదపుంగ్రోతులలోన హాస్యపునిధుల్ బెంపొందెడిన్, నవ్వుతోం
బదిపా శ్శౌషధమై, కుదుర్పగల దాత్మక్లేశ రోగోద్ధతిన్.

అదిగో చూడుము రక్తరంజితకషాయచ్ఛాయలన్ జిమ్ముచున్
బదివం(డెండు హిమాద్రిశృంగములు కన్పట్టున్ సముచ్ఛ్రాయమై
మదురం బాకపుమంచుకాంతు లొలయన్ బొల్పారు నక్కొండపై
గదలు న్నేటి త్రివర్ణ కేతనము, ప్రోద్గాఢ ప్రజాహంకృతిన్.

ఎక్కటి వీరుడై, దొరల యేబ్బడితోడ నెదిర్చి, రక్తపుం
జుక్క విరోధిమేన జవిచూడక, ఘూర్జరవృద్ధుల, గెల్చి గ
ట్టెక్కిననాడు, దేశజనయుక్తి ముదంబున వాలుకొప్పునన్
జెక్కిన పుష్పరాజమది, నీ జననస్మృతి చిహ్నమంగనా ?

నివ్వరిధాన్యమున్ మెసవి, నిగ్గులు దేలిన కండపుష్టితో
మువ్వలు గజ్జెలుం బసిడిపూసలు గల్లున మ్రోయుచుండగా
రివ్వున మింటికి న్నెగసి శృంగయుగంబున నద్రిజాలతో
జివ్వయొనర్చునంది; పురజిత్తుని వాహనమంబుజాననా.

ఎద్దు నడయాడు సీమలం దెల్లకడల
క్రొవ్వు వెలివడ్డ గాయాల గుఱుతులట్లు
కానుపించెడి కొన్ని కక్కసపుగంట్లు,
చెలియ ! యవిదాని యుక్కు గిట్టెలక్షతాలు.

అతిస్నిగ్ధంబయి పట్టుజిక్కని ఏసీయాద్రి ప్రదేశంబులం
దతి సౌలభ్యముమీర బ్రాకెదరు బోయల్ కొంద రాదిప్యగో
పతిరింఖాంకము లందు కాంతమణి సోపానంబులై క్రాల, స
ద్గతికి న్నిచ్చెనలండ్రు శైవులా తదుక్షస్వామి పాదాంకముల్.

అగుపించె శిఖరాలు ఉగివచ్చు నెలయేటి
    తరగలో నడయాడు దాసదీప్తి
కనుపట్టె స్వాతిమేఘాల గర్భమునందు
    తప్తభూతలము నోదార్చు చలువ
దీపించె ప్రతి చిన్నితీవ సుందరియందు
    నాలింగన ప్రణయానురక్తి
తోచె ప్రభాతవాతూల బాలకులందు
    ముట్టిమూపుల దట్టిపోవు మైత్రి

త్యాగులైన వారి ధర్మసందేశంబు
లాచరించు ప్రకృతి నభినుతించి
అస్వరాజ్యకన్య యత్మలోగల చింత
తెల్లమరచి మేను పల్లవింప.

ఆ జెండాపయినున్న రాట్నమున గాయాల్వడ్డ నెమ్మేన బా
పూజీ దీయుచునుండు నేటికిని సంపూర్ణ స్వరాజ్య ప్రతి
ష్ఠా జైవాతృకరోచిరంచిత విరాజచ్ఛాంతి సూత్రంబులన్
మాజీభారత భావదాసులకు సన్మార్గంబు సంధింపగన్.

అని చెలికత్తె బల్కు సమయంబున చేరువ పల్లెనుండి హా
య్మని వినిపించె మేటి కదురాడిన సవ్వడి గాలిపాటునన్
కనులకు గోచరించె నలనాటి మహాత్ముని మూర్తి కల్లితో
కనకపు కాంతితో, తుహినకాంతుల కమ్మని హాసరేఖతో.

తాత వచ్చెనంచు తడబాటువడి చూచి
కలికి, వట్టి బయలు కౌగిలించి
యాషదీషదర్థహీన శబ్దంబుల
నుచ్చరించి నేల కొరగి పడియె.

ఒక్కనిమేషకాలమటు లుర్విపయిం బడియుండి, మోమునన్
జక్కని కాంతిరేఖ విలసిల్ల, దటాలున లేచి, తాత యా
దిక్కున కేగినాడని నదీనదముల్ గిరు లుత్తరించుచున్
జెక్కిన కొంగుతోడ బరచెన్ జెలికత్తెలు వెంట నంటగన్.

మోజుపడి తాతకోసము
రోజులు వారములు దిరిగి రోజుచు తుదకున్
రాజాఘట్టము జేరి వ
యోజానన ! మే నెటింగి యూర్పులు చిమ్మెన్.

# స్వ య ం వ ర ం

శిలయైన తాత
తలవాలిచి మ్రొక్కి కొంత తాసముడిగి, కా
గలవాని, జాలిగుండెలు
గలవానిని, తాత కనశికలు గలవానిన్.

పంచేంద్రియముల దర్పమును గుప్పిటబట్టి
హూంకరించెడు మీసమున్నవాని
ప్రాగ్దురాచారదుర్భర సింహగర్జకు
నురమొడ్డి యెదిరించి యోర్చువాని
అంబికాధవుని పశ్యన్నేత్రమును బోలి
తడబాటులేని వర్తనమువాని
కష్టానుభూతి విశ్వంబు నాహరించి
పదుగురి హృదయాల మెదలువాని

కరముచెందుగాంధి కత్తివాదరమీది
కఠినతపము చేయగలుగువాని
హృదయమున్నవాని నీడుజోడగువాని
ప్రేమమీర భామ పెండ్లియాడె.

# హి మ గి రి యా త్ర

ఈడుఁజోడని మెచ్చె నయ్యమెరికా, యింగ్లండు చీనా జపా
న్లోడల్ నించి యవారిగాబనిపె నెన్నో కాన్కలాశీస్సులన్
దాడిదుష్వ్రైవెభాసనెన్ బరిషియాస్థానాష్టనిస్థానులే
కీడు న్మేలనకుండ నంపుకొనె పాకిస్థాన్ ప్రసూనాక్షతల్.

లేత స్వరాజ్యరాజ్ఞి సఫలీకృతదివ్యదభీష్టయై సుఖ
జ్యోతులు ప్రజ్వరిల్ల వివిధోర్వరమాప్రణతుల్ గ్రహించి ఢి
ల్లీ తపనీయపీఠి శుభలీల నధిష్ఠితయైనయంత ని
ర్భీతి సచాయసల్పి, సరవిందలయెత్తె విశాల ధర్మముల్.

ఆస్తిక్యము మాటలుగా
నాస్తిక్యము పనులుగాగ నటియించు వృధా
ప్రస్తుత వాతావరణము
వాస్తవ సచ్ఛీలధర్మపథమున నడచెన్.

జాతీయ కళలు రాకా
శీతాంశుని కరణి నుల్లసిల్లె సుభిక్షా
శీతాంశుకధారిణియై
భూతలము రహించె గాజుపూసల సిరులన్.

# స్వ యం వ రం

హలముసోకి నేల విలసిల్లె బంగారు
తీగయగుచు డిల్లిభోగయగుచు
కలము చేతబట్టి, జలజాక్షి విద్యావి
భూషయయ్యె సత్యభాషయయ్యె.

స్వయముగ జూచివచ్చిన యశాంతపరిస్థితి చక్కదిద్ది దు
ర్ణయము నడంచి, ప్రాజ్ఞులు ధురంధరులైన యమాత్యశేఖరుల్
ప్రియము ఘటింప భారత చరిత్రకు నూతనశోభగూర్చి ము
త్తయిదుతనంబుతోడ, ప్రభుత న్నెరవేర్చె సహస్రవర్షముల్.

తెల్లని రాజులు కీరితి
వెల్లువలై సీమవరకు బేరెమువారన్
ఢిల్లీ హస్తినగాగా
చల్లని పాలనము రాణి సంస్థాపించెన్.

మనవాడు కాదులెమ్మని కార్యములపట్ల
పక్షపాతపు జూపు బరపువారు
కర్మశాస్త్రములకు గరములు జోడించి
భుజశక్తులను నిద్రబుచ్చువారు

## హి మ గి రి యా త్ర

చిన్ని నా బొజ్జకు శ్రీరామ రక్షయం
చోరుల వచ్చునకు నిట్టూర్చువారు
నవయువానుల భావ నవ్యవాహినులు శం
కించి సేతువులు బంధించువారు

దేశసేవ మఱచి, దేశము సేవకై
గొప్ప పదవు లందుకొనెడువారు
స్వార్థచింతలేని జాతీయప్రభ్విని
పొలుచునాడు కలికమునకు లేరు.

ఆపదనున్నవాడు శనకంతపు పొంతల జుట్టమైన సం
తాపము వెల్లడించు గిరిదాటని ధర్మము విశ్వసౌహృద
వ్యాపృతికి న్విరోధమని యారటమంది ప్రపంచమైత్రి సం
స్థాపనకై సమత్వము ప్రచార మొనర్చె సమస్త జాతులన్.

పరిణతికి స్పృహింపక యపారశతాబ్దచయోభరంబునన్
నరముల కెక్కిపోయిన సనాతన సాంఘిక దుష్టదృష్టిచే
నరసులు సత్యశీలుర యశస్సునకుం బలియౌ పెఱింగి, యీ
తెరమరుగుం బ్రమాదము దీర్చు నుపాయములేక దుఃఖిలెన్.

# స్వ యం వ ర ం

స్తంభితంబగు పయోజన మహోజడనిధి
జలధిగా నక్షరాస్యత ఘటించి
క్షేత్రసుందరికి నచ్చిన వ్యావసాయిక
దోహదంబులకు చేదోడొసంగి
త్రికరణంబులకు పొందికపొత్తు చేకూర్చు
సత్కళావిద్య కాశ్రయము జూపి
ముదిరిపోయిన నేటి ముమ్మాయి ముఠాల
యధమ సంస్కృతికి సన్యాస మిచ్చి

మధుర వర్తనులగు మేటి మంత్రిమణులు
గృహముదీర్ప ప్రజారాజ్య వహనమగుచు
బసుపుగుంకాల సిరిలోడ భరత పీఠి
పాలనము చేసె వేయేండ్లు ప్రతిభమీర।

గాంధిన్ జంపి మిఠాయి బంచిన యయుక్త క్రూరవర్గాలతో
బంధుత్వంబు పరిత్యజించి యలఘు ప్రత్యక్ష వైరంబులన్
సంధానించు మతాలు చూపు నల్లమ్మోక్షశ్రీ విసర్జించుచున్
సంధించె న్నవభారతంబున స్వాతంత్ర్య సురజ్యోతులన్.

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాంతం కైఫీయతు | 1 | 0 | నేనూ మాకాంతం | 1 | 0 |
| మునిమాణిక్యం నాటికలు | 1 | 0 | మునిమాణిక్యం కథలు | 1 | 0 |
| [illegible]ధ్యాయుడు | 1 | 0 | కాంతం కాపురం | 1 | 0 |
| శరద్రాత్రులు | 1 | 0 | దీక్షితులు | 1 | 0 |
| రుక్కుతల్లి | 1 | 0 | తగూ నెంబరు త్రీ | 1 | 0 |
| యథార్థ దృశ్యాలు | 1 | 0 | వినోద వ్యాసములు | 1 | 0 |
| కాంతం | 1 | 0 | నా స్నేహితులు | 1 | 0 |
| హాస్యకథలు | 1 | 0 | దాంపత్య జీవితము | 1 | 0 |
| తల్లిప్రేమ | 1 | 0 | రేడియో నాటికలు | 1 | 0 |
| కథానికలు | 1 | 0 | రాధబాబు | 1 | 0 |
| తిరుమాళిగ | 1 | 0 | మేరీ కహానీ | 1 | 0 |

## శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాలక్షేపం 1 వ భా॥ | 1 | 0 | మాయలమాలోకం | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | అవును | 1 | 0 |
| గుసగుస పెళ్ళి | 1 | 0 | నిజం | 1 | 0 |
| ఇప్పుడు | 1 | 0 | మాటవరస | 1 | 0 |
| అప్పుడు | 1 | 0 | తనలో | 1 | 0 |
| అన్నీ తగాదాలే | 1 | 0 | మేజువాణి | 1 | 0 |
| రెండురెళ్లు | 1 | 0 | మన తెలుగు | 1 | 0 |
| పెళ్లి ట్రెయినింగ్ | 1 | 0 | లోకోభిన్నరుచిః | 1 | 0 |

## శ్రీ జి. జాషువకవిగారి ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఖండకావ్యము 1 వ భా॥ | 1 | 0 | ఖండకావ్యము 3 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | డిటో 4 వ భా॥ | 1 | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఖండకావ్యము 5 వ భా॥ | 1 | 0 | గబ్బిలము 1 వ భా॥ | 1 | 0 |
| నేతాజీ | 1 | 0 | డిటో 2 వ భా॥ | 1 | 0 |
| బాపూజీ | 1 | 0 | పిరదౌసి | 1 | 0 |
| కాందిశీకుడు | 1 | 0 | స్వయంవరము | 1 | 0 |
| స్వప్నకథ | 1 | 0 | తెరచాటు(కల్పితనాటకం) | 1 | 8 |
| ముంటాజమహల్ | 1 | 0 | మీరాబాయి (చరిత్రాత్మక నాటకం) | 1 | 8 |
| నాకథ (జీవితం) | 1 | 8 | | | |

శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి

ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉమర్ ఖయాం | 1 | 0 | శబరి | 1 | 0 |
| పంచవటి | 1 | 0 | మృత్యుంజయం | 1 | 0 |
| బృందావనము | 1 | 0 | శృంగార చాటువులు | 1 | 0 |
| సుభాషితము | 1 | 0 | | | |

వేగుజుక్క గ్రంథమండలి, బరంపురంవారి

అపరాధ పరిశోధక నవలలు

| | | | | |
|---|---|---|---|---|
| వాడేవీడు | 1 వ భాగము | 1 | 8 | 0 |
| నేనే | 2 వ భాగము | 1 | 8 | 0 |
| కాలూరాయి | 3 వ భాగము | 1 | 8 | 0 |

(ఈ పై మూడు కలసి జామిలియా కథ యగును)

| | | | |
|---|---|---|---|
| వేంకట్రావు | 1 | 8 | 0 |
| కోటీశ్వతనయ | 1 | 8 | 0 |
| విద్యార్థి విపత్తు (కర్లపాలెం కృష్ణారావుగారు) | 1 | 0 | 0 |
| వేదంతీ-తంటా....(228 పేజీలు) | 1 | 8 | 0 |

## ఆంధ్రప్రచారిణీ గ్రంథమండలివారి నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| సీతారామరాయలు | 1 | 8 | శకుంతల | 1 | 0 |
| రాజసింహ | 2 | 0 | పూర్ణానందము | 2 | 0 |
| మృణ్మయి | 1 | 8 | దృఢప్రతిజ్ఞ | 1 | 8 |
| సంపూర్ణ శ్రీకృష్ణ చరిత్ర | | | వసుమతీవసంతము | 2 | 0 |
| 1 వ భా॥ | 1 | 8 | అపరాధిని | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 | ప్రణయచాంచల్యం | 1 | 8 |
| అపరాజిత | 1 | 8 | రజని | 1 | 0 |
| మధుర | 1 | 8 | వంగవిజేత | 1 | 8 |
| మృణాళిని | 1 | 8 | నౌకాభంగం 1 వ భా॥ | 2 | 0 |
| విషవృక్షము | 1 | 8 | డిటో 2 వ భా॥ | 2 | 0 |
| కృష్ణకాంతుని మరణ | | | నూర్జహాను | 2 | 0 |
| శాసనము (పరిశోధక | | | అల్లాహో అక్బరు | 1 | 8 |
| నవల) | 1 | 8 | జమీందారు-రామరాజు | 1 | 8 |
| కమలాకాంతుడు | 0 | 6 | క్షమార్పణ | 2 | 0 |

## కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహల్యాబాయి | 1 | 0 | సౌందర్యతిలక 1 వ భా॥ | 1 | 8 |
| రాజరత్నం | 1 | 0 | డిటో 2 వ భా॥ | 1 | 8 |
| కృష్ణవేణి | 0 | 12 | వినోదములు 1 వ భా॥ | 1 | 0 |
| హేమలత | 1 | 4 | డిటో 2 వ భా॥ | 1 | 0 |
| కర్పూరమంజరి 1 వ భా॥ | 1 | 8 | Tales of Rajesthan అను | | |
| డిటో 2 వ భా॥ | 1 | 8 | రాజస్థానకథావళి 1 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయం | 1 | 4 | డిటో 2 వ భా॥ | 1 | 8 |

| | | |
|---|---|---|
| మణిమంజరి | 0 | 6 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| చమత్కారమంజరి 1 భా॥ | 1 | 0 |
| డిటో 2 భా॥ | 1 | 0 |
| Lives of Great men మహాపురుషుల జీవిత చరిత్రలు 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| డిటో 3 వ భా॥ | 1 | 8 |
| రామకృష్ణ పరమహంస Life and Teachings | 1 | 0 |
| ప్రహసనమంజరి | 1 | 0 |
| నవ్వులగని | 1 | 8 |
| నానక్ చరిత్ర | 0 | 12 |
| గురుగోవింద చరిత్ర | 0 | 12 |
| సిద్ధార్థ చరిత్ర (గౌతమ బుద్ధుని జీవితం) | 1 | 0 |
| రఘుకుల చరిత్ర (రఘువంశం) | 0 | 10 |
| సుధాశరచ్చంద్రము 300 పే॥ Lake of Palms | 2 | 0 |
| గణపతి హాస్యనవల 1 భా॥ | 1 | 0 |
| డిటో 3 భా॥ | 1 | 0 |
| నందచరిత్ర | 0 | 4 |
| కృపాంభోనిధి (భక్తచింతామణిలోవలెనే భక్తిరస పద్యములు కలవు) | 0 | 4 |
| భారతకథామంజరి | 0 | 8 |

## శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రిగారి పరిశోధక నవలలు

| | | | |
|---|---|---|---|
| భీషణ ప్రతిహింస | 1 | 8 | 0 |
| ఘోరప్రతిక్రియ | 1 | 8 | 0 |
| బలవంతరావు | 1 | 8 | 0 |

వలయువారు:—

**కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,**

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.